

భాగవతుల లక్ష్మీనారాయణ శాస్త్రి.

జననము—19-12-1839. గ్రంథకర్త. నిర్యాణము—30-3-1922

# AMBITION.

As a Sanskrit Pandit of the Maharajah's College, Vizayanagram and as the author of "Sanshipta Ramacharitam" 'Sreerama Vijayam' and other Sanskrit works, Bhagavatula Lakshminarayana Sastri Garu is already known as one ef the greatest Pandits in the country, and he needs no introduction now. Tre fact is that this "Satyavrati Satakam" in Telugu Verse was the outcome of a literary competitien then started by Maharaja Sri Ananda Gajapati Raj of Vizianagram. It is therefore hoped that this book will attract the attention of the modern critics who may desire to sketch out and allocate the positions of the several competitors who entered the gallery. This is the only ambition in placing the book before the Andhras besides the practical usefulness of the work.

2. Thanks to the friendly assistance of Mr. G. Baboorow and the earnestness of "Sree Ramanuja Vilas Press" of Vizianagram. This book could be published after a lapse of over 40 years as a token of regard by the author's dutiful son.

Chatrapur,<br>28-8-29. **B. Lingamurty.**

# పీఠిక.

శ్రీ విజయనగర సంస్థానాధీశ్వరుండును, మహాపండిత గోష్ఠీనిత్యనిరతుండును, సకలకళాధురీణుండును, నూతనకవికవితాపరిపాకరసజ్ఞుండును, నగు శ్రీమదానందగజపతిసార్వభౌముండు జనతోల్లింటివారిం బోలి పండితాదరణీయుండై యుండెను. అట్టిభూపతుల విద్వత్సభలో ననేకవిద్వాంసులు కూడియుండ నొక్క దినంబున శ్రీమదానందగజపతిసార్వభౌముం డిష్టాలాపంబు లాడుచు "సతతము సంతసమొసంగు సత్యవ్రతికిన్" అనుసమస్యను దెల్పి యీమకుటంబున నొకశతకమును రచించవలసినదిగా పండితులకెల్లరకు నాజ్ఞనొసంగిరి. భూపతుల మనోరథము చెల్లించుటసాధ్యమనియు, నందువలన నిష్టసిద్ధియుఁగూడ గలుగుననియు, ధైర్యముగలమహాపండితులెల్లరును తమతమవిద్యానైపుణ్యగోచరంబుగను సమస్యానుగుణ్యంబుగను శతకములననేకములవ్రాసిరని తెలియవచ్చెడిని. మరియు ప్రౌఢులగు మహాపండితులనిజప్రజ్ఞావిశేషముల స్వకృతటిప్పణమూలమునఁదక్క పరిశీలించుట యసమంజసమని యోచించుటచేఁ గవితాత్పర్యనిరూపణంబగు టిప్పణంబుగూడ సంగ్రహంబుగ నుపనిబద్ధంబయ్యె. ఈసందర్భంబున శ్రీవిజయనగరమహారాజావారి కళాశాలలో సంస్కృతపండితులు, నస్మద్పితృలునగు శ్రీభాగవతుల లక్ష్మీనారాయణశాస్త్రిగారిచేఁగూడనీశతకము చెప్పఁబడియె. కాని, యాశతకములు భూపతులయాస్థానముంజేరి పరీక్షింపఁబడక పూర్వమె, కృతినాయకులు కాలవశమ్మునఁజిక్కి కీర్తిశేషులైరి.

ఈగ్రంథము సుమారు నలువదివత్సరంబుల క్రిందట విరచితంబయ్యె నిప్పుడు ప్రచురింపఁబడియె.

విజయనగరము.
20—3—29.

భాగవతుల లింగమూర్తి.

క. వాణీ వీణావిలస
త్పాణీ ఘ్రాణజిత గంధఫలి భారతి బ్ర
హ్మాణీ హారిమధ్యమ క
ళ్యాణీ మద్రసన తుదమెలంగుము కరుణాన్.

మ. కనకాహార్యశరాసన రాసభవిపత్సాజిహ్మగా జిహ్మగా
వనిపస్ఫారగుణా గుణాకర కరవ్రాతాధరీపూత పూ
తన యాదిత్యముఖగ్రహ గ్రహపతీం ద్వార్చిష్మదుస్రాంచితా
నన నాళీకుసుమా సుమాంబకవపుర్నాశంకరా శంకరా.

శ్రీ ర స్తు.

# సత్యవ్రతి శతక ప్రారంభము.

క. శ్రితజన రక్షణ నిత్య
వ్రత దీక్షాతత్పరులగు వారాహీ శ్రీ
పతి వాణీపతుల కృపన్
సతతము సంతసమొసంగు సత్యవ్రతికిన్. 1

## — టిప్పణ ప్రారంభము. —

క. గణపతి చరణంబులకున్
బ్రణమిల్లుచు సత్యశతక ఫణితికినై టి
ప్పణ మొనరించెదను, సుధీ
మణులార! వినుండు! దీని మన్నించి కృపన్.

కవిసార్వభౌముండగు మయూరునిచే విరచితంబగు సూర్యశతకంబునుంబోలి యీసత్యవ్రతిశతకంబును గావ్యంబగుటం జేసి "మంగళాదీని మంగళమధ్యాని మంగళాంతాని" యను భాష్యకారవచనమునుంబట్టి "ఆశీర్నమస్క్రియావస్తు నిర్దేశో వాపితన్ముఖమ్మ"ను నాలంకారిక వచనమునుంబట్టియుఁ గృతికర్తృకృతినాయకులకు శ్రేయస్సాధనంబగు నిష్టదేవతాప్రార్థన రూపంబగు మంగళమాచరింపఁబడుచున్నది. 'శ్రితజన రక్షణ' యని ఆశ్రితజనుల రక్షణమే నిత్యవ్రతముగాఁగలిగిన గౌరీపతి

లక్ష్మీపతి సరస్వతీపతుల కరుణచేతన సత్యవ్రతునకు నెల్లప్పుడు సంతోషము ప్పొంగుఁగావుత యని యర్థము. ఇచ్చటఁ గృతి నాయకుండగు శ్రీమదానందగజపతిమహారాజు సత్యవ్రతిత్వ రూప సామాన్యధర్మముచే నిర్దేశింపఁబడెను గావున పర్యాయోక్తాలంకారము నెఱుంగునది. "పర్యాయోక్తంతు గమ్యస్యవచో భంగ్యంతరాశ్రయం" అని తల్లక్షణము. తెనుఁగు ప్రబంధము లయ్యెడు మొదట శ్రీకారముంచుట సంప్రదాయ సిద్ధంబయిన నిచ్చట సమస్యాన సారంబునంబట్టి ప్రాసపూర్వాక్షరము దీర్ఘముగానుండుటకు శక్యముకానందున శ్రీకారముంచఁబడినది. ఇంతియకాక యిది సకలజనశ్లాఘనీయంబును మంగళములకుంగూడ మంగళంబునగు సత్యప్రశంసయగుటం జేసి వర్ణగణాదిశుద్ధి యత్యంతావశ్యకంబుకాదు. మఱియును సమస్యాగతంబగు "సత్యవ్రతి"యనుచోటున "నకర్మధారయాన్మత్వర్థీయో బహువ్రీహిశ్చేత్తదర్థప్రతిపత్తిః" అను భాష్యకారవచనమునుబట్టి దూషణోద్ఘాటనంబు. కృష్ణసర్పవాన్ వల్మీకః" అను భాష్యకారప్రయోగమునుబట్టి శశవిషాణకల్పంబని యెఱుంగునది. కావున సర్వంబు ననవద్యము.

క. అతిదుర్జ్ఞేయా సంభా
వితవిఘ్నపరంపరావివిధ విస్ఫూర్జ
త్ప్రతిపక్ష క్షితిపకృపణ
సతతము సంతసమెసంగు సత్యవ్రతికిన్. 2

మఱియు మంగళాంతరము చేయఁబడుచున్నది. అతిదుర్జ్ఞేయ యని తెలిసికొనుటకుశక్యముకానట్టియు నూహించుటకుఁగూడ

నసాధ్యమగు విఘ్నపరంపరల స్ఫురణములకు నివర్తకుండగు
మహాపురుషుని దయచేతను సత్యవ్రతునకు సంతసమొసంగునని
యర్థము. ఇచ్చట విఘ్ననివర్తకత్వరూప సామాన్యధర్మము
చేతను గణాధిపతి హయగ్రీవాదులు కవితాత్పర్య గోచరులగు
చున్నారు. ఇంక నీపద్యార్థము కృతినాయకునింగూడ నవగ
హించుచున్నది.

క. వెతుకుచు హేతువు నుపమను
యుతముగ ననువాదతుల్య యోగితలందాఁ
గొతుకకయతికెడు కవికిన్
సతతము సంతసమొసంగు సత్యవ్రతికిన్. 3

సమస్యార్థముతో సందర్భించుటకు నుపయోగించెడు
కొన్నిరీతులు తెలియఁజేయఁబడుచున్నవి. వెతుకుచు హేతు
వునని కారణమును ఉపమానమును అనువాదమును గుణో
త్కృష్ట సమీకరణరూప తుల్యయోగితాలంకారమును ఇంక
ప్రశ్నోత్తరభావమును నూహించుచుసమస్యాపూరణముఁజేయు
కవికిని సత్యవ్రతికిని సతతము సంతసమొసంగునని యర్థము.
శబ్దానువాదము, అర్థానువాదము, ఉభయానువాదము, అని
యనువాదము మూఁడు తెఱంగులుగా నుండును. హేతూప
మాదు లచ్చటచ్చట దిఙ్మాత్రముగాఁ గనుపర్చఁబడును.

క. కృతిసాధ్యతేతికర్త
వ్యతేష్ట సాధనతలఁ దెలియఁగ మొదలిడినే

రుతునని ముగించుకవికిఁ
సతతము సంతసమొసంగు సత్యవ్రతికిఁ॥ 4

తనప్రయత్నమునకు సాధ్యమనియు, రచియించు క్రియ యిష్టదనియు, నిష్టసిద్ధికలుగుననియుఁ దెలియఁగా నారంభించి సమాప్తిని బొందించెడు కవికిని సత్యవ్రతునకును సంతసమొసంగు నని యర్థము. ఇచ్చట కృతిసాధ్యతాజ్ఞానము, ఇష్టసాధనతాజ్ఞానము, ఈరెండును ప్రవృత్తిజనకములనియు, ఇతి కర్తవ్యతాజ్ఞానము గ్రంథసమాప్తి జనకంబనియు నెఱుంగునది.

క. అతుల ప్రౌఢనవీనక
విశారసజ్ఞులు మొదలిడి పీడక తుదకుం
గృతి బరికించిన కవికిఁ
సతతము సంతసమొసంగు సత్యవ్రతికిఁ. 5

మిక్కిల ప్రౌఢులగు నూతనకవితారసజ్ఞుఁలు కృతినిజూడ నారంభించి వదలక తుదముట్టంజూచిన నాకవికిని సత్యవ్రతికిని సతతము సంతసమొసంగునని యర్థము. ఇచ్చటను, తుల్యయోగితారీతిని నర్థసందర్భము నూహింపవలయును.

క. రుతిపరుషమయి సరళముగ
నుతభావముగనిన ప్రాసమునిడి సమాస్యా
గతిని సరసులనిరెటులన
సతతము సంతసమొసంగు సత్యవ్రతికిఁ. 6

శబ్దస్వభావముచేతను పరుషమయినను సరళముగాన్ ఋజుభావముగాను శ్లాఘనీయంబగు ప్రాసాక్షరము నునిచి

రసికులు సమస్యారూపముగా "సతతమునంతసమెసంగు సత్య వ్రతికిన్" అనిపలికిరనియర్థము. ఇచ్చట విరోధాభాసాలంకారము నూహింపవలయును. క-చ-ట-త-ప-లు పరుషములు. గ-జ-డ-ద-బ-లు సరళములు. అను తెనుఁగు వ్యాకరణ సంకేతమునుబట్టి విరోధము స్ఫురించుచున్నది. సరళ శబ్దమునకు ఋజుభావము గానని యర్థము చెప్పుటచేతను విరోధపరిహారము నూహింపవలయును. "అభాసత్వే విరోధస్య విరోధాభాస ఇష్యతే" అనిలక్షణము. ఇంకను సరళముగను, తభావము, అని పదవిభాగముచేసి త-కారభావము అని అర్థము చెప్పినఁ జనుత్కారాంతరము గానంబడును. అట్లయిన నిచట ద్రుతప్రకృతికమున కనంతరము తకారముండుట చేతను దకారాదేశము రాఁగా ప్రాసభంగము కానంబడుటయేకాక, ప్రథమోక్తార్థమునకుంగూడ భంగమున్నది కాన, తిక్కనసోమయాజి యుద్యోగపర్వమునఁ బ్రథమాశ్వాసమునందొక పద్యములో త-కారమునకు ద-కారాదేశము మానివేయునటుల నిచటను మానివేసినయెడల నర్థద్వయమునకును బాధకము లేదు. తిక్కనసోమయాజి కృతంబగు పద్యమిచ్చట వ్రాయఁబడుచున్నది. పరిశీలింపుడు:—

"మ. ధృతరాష్ట్రిండును బుత్రులున్ననముకుం
తీ నందనుల్ సింహముల్
మతినూహింపనసింహమైన వనముల్
మర్దింతు రెందున్ననా

వృతవృత్తంబులుగానిసింహములకు
స్వేగంబ చేటొందుగా
నతగంబొందుట కార్యమీయు భయమున్
సంతుష్టిమైనన్నికిన్॥"

ఇందు నాలుగవ పాదంబున దుష్క్రితరాహిత్యము గానం బడుచున్నది. మొదటియర్థమునకును, పద్యమునకును,ఏవిధమ యిన బాధకము లేకపోయినను, రెండవయర్థమును విద్వత్కవి సమ్మతమయినయెడల బంగారునకు వెలిగారమద్దిన యటుల నుండునని యీశాఖా చంక్రమణము నంగీకరించుట యని యెఱుంగునది.

క. హితులు తరింప సుహృత్సం
మితముగ మహితులు సమస్యమిషచే బరికిం
చి తగంబలికిరి యెటులన
"సతతము సంతసమెసంగు సత్యవ్రతికిన్." 7.

పూజనీయులగు మహాత్ములు తమ హితులు సత్యప్రి శంసఁ జేయుటచేతను దరింతురుగాక యనిసమస్య మిషచేతను సుహృత్సమ్మితముగా "సతతము సంతసమెసంగు సత్యవ్రతి కిన్" అనిపలికిరి అని తాత్పర్యము. ప్రభుసమ్మితము, సుహృ త్సమ్మితము, కాంతాసమ్మితము, అని యుపదేశము మూఁడు విధములుగానున్నది. అందులోఁప్రభుసమ్మితములు వేదములు, సుహృత్సమ్మితములు పురాణములు, కాంతాసమ్మితములు

కావ్యములు, అని చెప్పఁబడును. ఇచట "సుహృత్సమ్మితముగ" నని కేవలార్థప్రధానముగాఁజెప్పుటచేతను కేవలార్థానువాదము. మీఁదిపద్యములో "ప్రాసనునిడి" యని కేవలశబ్దప్రధానముగా చెప్పుటచేతను కేవలశబ్దానువాదమని యెఱుంగునది. సమస్యాకల్పకులను ప్రకారాంతరముగాఁ జెప్పుటచేపర్యాయోక్తాలంకారమనియుఁ దెలియ వలయును. పూర్వశ్లోకము నకునీపద్యమునకును వైచిత్ర్యవిశేషమునుబట్టి చాలభేదము న్నందున పౌనరుక్త్యాశంక పుట్టఁగూడదు.

క. అతి చాతురీ ఫణితి సూ
  నృత సుసమస్యాచ్ఛలమున కృపతో సౌజ
  న్యృత నిధులండ్రిది యెటులన
  "సతతము సంతసమొసంగు సత్యవ్రతికిన్". 8.

అధికమగు చాతుర్యముచేతను రచియింపఁబడిన సమస్య నెపముచేతను సత్యవంతులగు సుజనులు "సతతము సంతసమొసంగు సత్యవ్రతికిన్" అని యుచ్చరించిరి. అని యర్థము. సౌజనీ+ఋత=సౌజన్యృత అని సమాసగత పదద్వయ సంధి నెఱుంగునది. "సమస్యాచ్ఛలమున" ననుటచేతను కేవలార్థానువాదము. కైతవాపహ్నవాలంకారము.

క. అతి మృదుల సులభతర పం
  డిత పామరజన సుకర విరత సుసమస్యా

విశారణ నిపుణు లిటులనిరి
"సతతము సంతసమొసంగు సత్యవ్రతికిన్." 9.

మిక్కిలి మృదువయి పండితపామరజన సుకరంబగు నీ సమస్యను సమస్యనిచ్చుటయందు చాతుర్యము కలవారు పలికిరని తాత్పర్యము. "సుకర" అనుస్థలమందు అర్థసౌకర్యమును శబ్దసౌకర్యమునుగూడ వివక్షితంబగుటంజేసి శబ్దార్థోభయానువాదమనియు సమస్యాకారులయొక్క అసాధారణ నామధేయమునుజెప్పక ప్రకారాంతముగాఁ జెప్పుటచేతను పర్యాయోక్తాలంకారము.

క. అత్రిగూశ్రి సస్యసంప
చ్ఛ్రితబహుళ సువర్ణపూర్ణసింధ్వవధి మహీ
పతికిన్ శ్రోత్రియమునికిన్
సతతము సంతసమొసంగు సత్యవ్రతికిన్. 10.

అధికమయిన సస్యసంపత్తితోను, ధనసంపత్తితోను, నిండియున్న సాగరావధి భూమండలమునకు నధిపతియగు చక్రవర్తికిని శ్రోత్రియమునికిని,సత్యవ్రతికిని ఆనందముప్పొంగునని తాత్పర్యము. తైత్తిరీయోపనిషత్తు (అగు నారాయణ ప్రశ్నము) నందు మానుషానందమును గురించి చెప్పినయర్థమిది. తుల్యయోగితా లంకారము. "గుణోత్కృష్టైస్సమీకృత్య వచోన్యాతు తుల్యయోగితా" అని లక్షణము.

క. ప్రతివస్తు వివేచన ధీ
కృత సామ్రాజ్యశ్రీ తీవ్రకేవల వైరా
గ్యతితిక్షా శేవధికిన్
సతతము సంతసమొసంగు సత్యవ్రతికిన్. 11

ప్రతివస్తువును బాగుగ పరిశీలించుట చేతను సామ్రా
జ్య సంపదనుగూడ తిరస్కరించెడు తీవ్రవైరాగ్యమును తితి
క్షయునుంగలవానికిని సత్యవ్రతికిని సతతము సంతసమొసంగు
నని తాత్పర్యము. తుల్యయోగితాలంకారము. లక్షణము
పూర్వపద్యమందలి టిప్పణమందు వ్రాయఁబడినది.

క. మితి మాన మే యభేద
త్రితయవిదూర పరిపూర్ణ తేజ స్సాక్షా
త్కృతిహత విక్షేపునకున్
సతతము సంతసమొసంగు సత్యవ్రతికిన్. 12

జ్ఞాతృజ్ఞేయజ్ఞానరూప త్రిపుటీశూన్యంబగు పరిపూర్ణ
బ్రహ్మజ్ఞానముచేతను జీవన్ముక్తునికి సత్యవ్రతికిని సతతము సం
తసమొసంగునని తాత్పర్యము. విక్షేపక్షతి చెప్పుటచేతను
తత్పూర్వ భావ్యావరణక్షత్యాక్షేప సిద్ధమనియుజీవన్ముక్తునికి
దేహాదిభానము కలిగియున్నను దగ్ధపటన్యాయమున నసద్రూ
పము గనుక విక్షేపక్షతి కలుగుననియు నెఱుంగునది.

క. ప్రతిసర్గ సర్గకోటీ
కృతినిష్ణాతాఖిలేశ కృష్ణార్ధాంగో

త్రితరాధాకాంత కృపన్
సతతము సంతసమొసంగు సత్యవ్రతికిన్. 13.

కోటులకొలఁది సృష్టిసంహారములను జేసెడు శ్రీకృష్ణదేవుని వామాంగమునం బుట్టిన రాధాదేవి రమ్యకృపచేతను సత్యవ్రతునకు సంతసమొసంగునని తాత్పర్యము. ఇచట రాధాకాంతునియొక్క కృపన్, రాధయొక్క కాంతకృపన్, రాధాకాంతునియొక్క కృపన్ అని మూఁడువిధములుగాను నిర్బాధకముగాఁ జెప్పవచ్చును. "కృష్ణాధారాం గోత్రిత" యని బ్రహ్మవైవర్తమునుబట్టి చెప్పఁబడినది.

క. ద్రుతవిస్ఫురిత యతి ప్రా
స తులిత రచనావిశేష సహిత ప్రతిభా
చిత తదుచిత చాతురికిన్
సతతము సంతసమొసంగు సత్యవ్రతికిన్. 14

శీఘ్రతరంబగు యతిప్రాస స్ఫురణమునకు సమానమగు రచనావిశేషములు ప్రతిభయును తగినంతచాతుర్యమును గలిగినవారికిని సత్యవ్రతికిని సంతసమొసంగునని తాత్పర్యము.

క. నుత గీతామృతపాన సు
హితాంతరంగ రతిసుప్రహిత వైరాగ్యో
ద్ధత దుర్గమంతునకున్
సతతము సంతసమొసంగు సత్యవ్రతికిన్. 15.

భగవద్గీతారహస్యము తెలియుటచేతఁగలిగిన యాత్మరతివైరాగ్యములచేతను దొలఁగింపఁబడిన చెడుబుద్ధియు దానివలన కలిగిన యపరాధములును గలవానికిని సత్యవ్రతునకును సతతము సంతసమొసంగునని తాత్పర్యము.

క. వితథీకృతార్థ మాత్రా
శతలాఘవ లబ్ధశబ్దశాస్త్రజ్ఞ శతా
యితపుత్రి మహోత్సవగతి
సతతము సంతసమొసంగు సత్యవ్రతికిన్. 16.

వైయాకరణునకు అర్ధమాత్రా శతలాఘవము చేతను బుత్రిమహోత్సవశత సదృశోత్సవము కలిగినయటుల సత్యవ్రతికి సతతము సంతసమొసంగునని తాత్పర్యము. "అర్ధమాత్రాలాఘవం పుత్రోత్సవం మన్యంతే వైయాకరణాః" అను నీపరిభాషనుబట్టి యిటులజెప్పబడియెను.

క. కితవ వ్రాతా లాపో
దిత మిథ్యాదోషజాల దీదాంసాస
ద్వ్రతదీక్షా దీక్షితునకు
సతతము సంతసమొసంగు సత్యవ్రతికిన్. 17.

దుర్జనులచేత నాపాదింపఁబడిన మిథ్యా దోషములను నివారించెడు దీక్షకలిగిన పురుషధౌరేయునకును సత్యవ్రతికిని సతతము సంతసమొసంగునని తాత్పర్యము.

క. కృతకేతర కులశీల
వ్రతపూజిత రుచిరుచిరసువర్ణ ప్రతిమా
ప్రతిమనవోఘా పతికిన్
సతతము సంతసమొసంగు సత్యవ్రతికిన్. 18.

సత్యమయిన కులవ్రతము చేతను శీలవ్రతము చేతను పూజితురాలగునట్టియు "రుచి" కాంతిచేతను పురుషుని యొక్క అనఁగా వరునియొక్క అభిలాషను బట్టియు మనోహరమయినదనియును సువర్ణప్రతిమకు సమానమయిన క్రొత్త పెండ్లికూతురు మగనికిని సత్యవ్రతికిని సతతము సంతసమొసంగునని పద్యార్థము, పెండ్లికంటె వేడుక లేదను నైతిహ్యమును బట్టి చెప్పఁబడియె.

క. రతిమాత్రఫలక కులటా
కృతకతరవిలాసవేష కృత్రిమకిలికిం
చితవంచితేతరమతికి
సతతము సంతసమొసంగు సత్యవ్రతికిన్. 19.

సంభోగమాత్ర ఫలకమగు కులటాజనముయొక్క కృత్రిమ విలాసవేష కిలికించితములచేతను వంచితుఁడుకాని పురుషునికిని సత్యవ్రతునకును సంతసమొసంగునని యర్థము.

క. స్వతిస్మి స్పర్శన విధ్వం
సితపాతకిసంగజాత చిరపాతక జ
హ్నుతనూజా కృతనుతిచే
సతతము సంతసమొసంగు సత్యవ్రతికిన్. 20.

సత్యవంతునియొక్క శరీరస్పర్శముచేతను నశింపఁజేయఁబడిన పాపాత్ముల సంపర్కముచేతను చిరకాలమునుండి కలిగిన పాతకములు కల గంగానదిచేతఁ జేయంబడిన స్తుతిచేతను సత్యవ్రతికి సతతము సంతసమెసంగునని యర్థము. అనఁగా పాపాత్ములందరును గంగలో మునుంగుటచేతను వారిపాపములు తొఁలగిపోయి గంగను జేరియుండగా నాగంగాపాపములు సత్యవ్రతి గంగలో మునుంగుటచేతను నశించుచున్నవనియు, అందుచేతను గంగ సత్యవ్రతిని స్తుతిఁజేయగా సత్యవ్రతి సంతసించుచునని తాత్పర్యము. అతిశయోక్త్యలంకారముచేతను సత్యవ్రతిమహిమాతిశయరూప వస్తుధ్వనియని యెఱుంగునది

క. సతతము సత్యవ్రతుఁగని
మతిసరిగా గరిమపధనిమగమా ధనిసా
గతిదివిజులు దివిఁబాడఁగ
సతతము సంతసమెసంగు సత్యవ్రతికిన్. 21

పుష్పఫల దర్పణాదులవలె నృత్తగీతవీణామృదంగాదులును స్వరూపముచేతను నామమాత్రముచేతను మంగళప్రదములగుటంజేసి గ్రంథమధ్యమున మంగళార్థముగాను సత్యవ్రతుని మహిమను గొనియాడుచు రెండు పద్యములచేతను గీతనృత్యములు చెప్పఁబడుచున్నవి. "సతతము" అని "రితధిమి" అనియు గంధర్వాది దేవయోనులు సత్యవ్రతునిజూచి "సరిగా గరిమపధనిమగమాధనిసా" యని షడ్జాదిస్వర విన్యాస

మును తాళకాలాద్యనుగుణముగాఁ గల్పించుచుఁ బాడుచుం డఁగా నాసత్యవ్రతికి సంతసమెసంగునని యర్థము. దేవతలు కూడ సత్యవ్రతుని గొనియాడుదురని తాత్పర్యము. ఇంతియ కాక ప్రకృతస్వరవిన్యాసమునందు ప్రకృతార్థోపయోగియగు నర్థముకూడ కవివివక్షితంబయి యున్నది. యెటులనిన, మతిన్-సరిగాన్_గరిమపధనిమగమాధనిసాగతి దివిజులు- అని పదవి భాగము. మనసునందు సరిగాఁబాడఁగన్ అని క్రియతో సం బంధము. గౌరవమును బాపాడకొనెడు ధనవంతులును బంధ నమును బొందిన లక్ష్మీదేవిచేతను ధనవంతులున, ఆగతితోఁ గూడుకొనియున్నవారును అగు దివిజులు అని సమానార్థము. తక్కినది సమానము. "మఃపుంసిబంధనేపింగ పింగాపాఫినర్థ యోః" అని నానార్థరత్నమాలయందు నేకాక్షర కాండము నందుఁ జెప్పఁబడియున్నది. బంధనమును బొందిన లక్ష్మికల వారు, అనగా స్థిరసంపదకలవారని తాత్పర్యము.

క. "రితధిమితక ఝేుందంధిమి
తతకుంగరి ఝెుణుతకిణతదాం ధణతకిణాం
ధితదింధిమి" యని యాడఁగ
సతతము సంతసమెసంగు సత్యవ్రతికిన్. 22.

నిరర్థకములయినను తాళకాల బోధకము లగుటచేతను సార్థకంబులగు "రితధిమి" మొదలగు నీశబ్దంబుల నుచ్చరిం చుచు దివిజులు దివినాడుచుండఁగా సత్యవ్రతికి సంతసమెసంగు

నని తాత్పర్యము. లేక సత్యవ్రతియే తాను ఆడుచుండునటుల తనకు సంతసమొసంగునని తాత్పర్యము. ఈపక్షమందు పూర్వ పద్యమునుండి కర్తృపదాక్షేపము చేయనక్కరలేదు. సత్య వ్రతిపదమునకు విభక్తివిపరిణామము నూత్రియయి యున్నది. నృత్యముచేత నానందాతిశయమును దానిచేతను సత్యమహి మమును దానిచేతను సత్యవ్రతి కృతార్థతయు నీరీతిగా ధ్వని పరంపర నూహింపవలయును.

క. అతిదూరతరా పునరా
గతి సత్యత్యాతివాహిక పురుషధుర్యా
యితమహిత సత్యమహిమన్
సతతము సంతసమొసంగు సత్యవ్రతికిన్. 23

మిక్కిలి దూరముగానుండెడునుపునరావృత్తి రహిత మునకు సత్యలోకమునకు తీసికొనిపోయెడు అతివాహిక పురు షునివలె నాచరించుచున్న సత్యముయొక్క మహిమచేతను సత్యవ్రతునికి సంతసమొసంగుననియర్థము. దహరాద్యుపాసనా పరులును, నిష్కామకర్మ నిరతులును నగు పుణ్యపురుషులు అర్చిరాదిమార్గమునుబొంది సత్యలోకమునకుఁ బోవునపుడు అతివాహికపురుషుఁడు వారినిసత్యలోకమునకుఁ గొనిపోవునని ఛాందోగ్యోపనిషత్తునందుఁ జెప్పఁబడియున్నది. అటులనేసత్య ము సత్యవ్రతుని సత్యలోకమునకుఁ దీసికొని పోవునని తాత్ప ర్యము. "ఆదిత్యాచ్చంద్రమసం చంద్రమసో వైద్యుతం తత్పు

రుషోఽమానవస్స ఏనాన్బ్రహ్మ గమయత్యేష దేవయానః
పంథా ఇతి" అని ప్రకృతోపయోగియగు ఛాందోగ్య వాక్య
మిదియని యెఱుంగునది. దీనియందుఁ జెప్పఁబడిన వైద్యుత
పురుషుఁడే అతివాహికుఁడని చెప్పఁబడును.

క. శ్రుతి జడవిధి విస్మృతి ను
త్తత గమనప్రాక్తన స్వతంత్రివార్తా
యితమహిత సత్యమహిమన్
సతతము సంతసమొసంగు సత్యవ్రతికిన్. 24.

వేదము చదువుటచేతను మందుండగు బ్రహ్మదేవుని
విస్మృతిని బోఁగొట్టుటకుఁ దాన బయలుదేరుటకు ముందు పం
పఁబడిన తంత్రివార్తవలె నాచరించుచున్న పూజనీయమగు
సత్యముయొక్క మహిమచేతను సత్యవ్రతికి సంతసమొసంగు
నని యర్థము. లోకములో కొందరు తాము బయలుదేరుటకు
ముందు టెలిగ్రాఫ్ పంపుదురు. దానింబట్టి వారు వీరి రాక
కు నిరీక్షించుచు జాగ్రత్తతో నుందురు. అటులనే సత్యవ్రతి
యొక్క సత్యప్రఖ్యాతినిబట్టి బ్రహ్మయును జాగ్రత్తతో నుండు
నని తాత్పర్యము.

క. మతయావదూర్ధ్వలోక
ప్రతిహారక పాటఫలక పటనపటు సూ
నృత వాఙ్మానస కృతులన్
సతతము సంతసమొసంగు సత్యవ్రతికిన్. 25

నుతిపాత్రంబులగు నూర్ధ్వలోకంబులయొక్క ద్వార
ములయొక్క తలుపుచెక్కలను బగులఁగొట్టుటకు సామర్థ్యము
కల సత్యముతోఁ గూడుకొనియున్న వాక్కుచేతను, మనస్సు
చేతను, క్రియచేతను, సత్యవ్రతి సంతసించునని యర్థము.
మనోవాక్కాయములచేతను సత్యముకలవారు ఊర్ధ్వలోకము
లకు వెళ్లునపు డేవిధమయిన ప్రతిబంధకములును లేవని తా
త్పర్యము. శబ్దక్రమముకంటె నర్థక్రమము బలవత్తర మగుటం
జేసి మానసపదము ముందుండకపోయినను కొఱంత లేదని తెలి
యునది. అతిశయోక్త్యలంకారము.

క. స్తుతపుణ్యలోక విహృతి
స్వతంత్రకవిధూమధూమ శకటాయిత సూ
నృతవాఙ్మనస కృతులన్
సతతము సంతసమొసంగు సత్యవ్రతికిన్. 26

స్తోత్రార్హంబులగు పుణ్యలోకములయందు విహరిం
చుటకు స్వతంత్రమగు పొగలేని పొగబండివంటి సత్యముతోఁ
గూడిన మనోవాక్క్రియలచేతను సత్యవ్రతికి సంతసమొసంగు
నని యర్థము. స్వతంత్రధూమశకట మనఁగా స్పెషల్ ట్రైన్
అని తాత్పర్యము.

క. వితతా విష్కరణీయా
ద్భుతగుణ వృత్తాంతపత్ర ముద్రాయంత్రా

యుతమహిత సత్యమహిమన్
సతతము సంతసమొసంగు సత్యవ్రతికిన్. 27

ముఖ్యముగాఁ బ్రకటింపందగిన యద్భుత గుణములకు నయి వార్తాపత్రికలను ముద్రించెడు ముద్రాయంత్రమువంటి సత్యముయొక్క మహిమచేతను సత్యవ్రతికి సంతసమొసంగునని యర్థము. సత్యమును బట్టి సర్వగుణములును బ్రకాశించునని తాత్పర్యము. ఉపమాలంకారము. వృత్తాంత పత్రమనఁగా "న్యూస్ పేపర్" ముద్రాయంత్రమనఁగా "ప్రింటింగుప్రెస్స్" అని యెఱుంగునది.

క. కితవోప జ్ఞోపక్రమ
వితతానృత వాతపోత విషధరరసనా
ద్వితయాయిత యుతమహిమన్
సతతము సంతసమొసంగు సత్యవ్రతికిన్. 28.

ముందుగా ధూర్తులచేత నూహింపఁబడి యాచరింపఁ బడుచున్న అధికమగు ననృతమనెడు వాతపోతములకు సర్ప జిహ్వాద్వయంబగు సత్యమహిమచేతను సత్యవ్రతిసంతసించునని యర్థము. పాములు గాలిని భక్షించివేసి యేరీతిగా నరిపుచ్చునో యారీతిని సత్యము అనృతమును నశింపఁ జేయునని తాత్పర్య ము. ఆద్యజ్ఞానము ఉపజ్ఞము. ఆద్యారంభము - ఉపక్రమము. అని "ఉపజ్ఞోపక్రమం తదాద్యాచిఖ్యాసాయాం" అని పాణిని సూత్రమునుబట్టి యెఱుంగునది. రూపకాలంకారము

క. కుతపానతి పాతపరీ
వృతదిజ్యావైశ్వదేవ వేదాధ్యయన
ప్రతిభాల సూనృతమహిమన్
సతతము సంతసమొసంగు సత్యవ్రతికిన్. 29

కుతపకాలము నతిక్రమించకుండునటుల ప్రవర్తించెడు వైశ్వదేవాదులకు సమానమయిన సత్యమహిమ చేతను సత్యవ్రతునకు సంతసమొసంగునని యర్థము. అహఃప్రమాణములో నెనిమిదవభాగము కుతపకాలమని చెప్పఁబడుచున్నది.

క. కతిపయసుర మందిర శ
స్తతటాకారామ సప్త సంతాన వితా
నతులిత సూనృత మహిమన్
సతతము సంతసమొసంగు సత్యవ్రతికిన్. 30

దేవాలయములు, తటాకములు, తోటలు మొదలగు సప్తసంతానములతోను సమానమగు సత్యమహిమ చేతను సత్యవ్రతికి సంతసమొసంగునని యర్థము.

క. ఘృతదధిసూపా పూపా
న్వితసుతిపాత్రాన్నదాన నిపాప్రపా
యిత సూనృత గోష్ఠీకృతి
సతతము సంతసమొసంగు సత్యవ్రతికిన్. 31

నెయ్యి, పెరుగు, పప్పు, తైలపక్వములతోఁ గూడికొని యున్న కొనియాడఁదగిన యన్నదాననిష్ఠకు సమానమగు సూనృతగోష్ఠీకరణముచేతను సత్యవ్రతికి సంతసమెసంగునని యర్థము.

క. కతకక్షోదనికషణ జ
నితనైర్మలిజల సదృశమణి ముకురఫలక
ప్రతిబింబంబును బోలుచు
సతతము సంతసమెసంగు సత్యవ్రతికిన్. 32

ఇండుగు తీసిన నీటివలె నిర్మలమగు మణిదర్పణంబున ప్రతిబింబము భాసించునటుల సత్యవ్రతికి సంతోషము భాసించునని యర్థము.

క. వృతి నిర్మోకవిముక్తా
తతచితి భుజగీసి పీతాతన్మాయామా
రుత జీవన్ముక్తునికిన్
సతతము సంతసమెసంగు సత్యవ్రతికిన్. 33

కుబుసము విడిచినపాముగాలినిపీల్చి సరిపుచున్నటుల నావరణశూన్యమయినబ్రిహ్మాకారవృత్త్యభివ్యక్తచిత్స్వరూపము మాయను నశింపజేయఁగా చిత్స్వరూపుండగు జీవన్ముక్తునికిని సత్యవ్రతికిని సంతసమెసంగునని తాత్పర్యము. సావయవ రూపకాలంకారము.

క. అతుల సితాసిత సుసరి
ద్వితయసమాగమధునీసదృశసత్సత్య
వ్రతమహితున కింకెవనికి
సతతము సంతసమొసంగు సత్యవ్రతికిన్. 34.

అసమానంబగు గంగా యమునానదీ ద్వయసమాగం
బునం గూడుకొనియున్న నదీతుల్యంబగు సత్యవ్రతముయొక్క
మహిమచేతను బూజితుండగువానికి నింకసత్యవ్రతికిని సంతస
మొసంగునని తాత్పర్యము. పరిశ్లిష్టార్థ భావముచేతను నిచట
సర్వసందర్భము గూహింపవలయును. విశేషణభేదముచుబట్టి వి
శిష్టభేదము నంగీకరింపవలయును. లేక "ఇంకెవనికి" నను చో
టున నాక్షేపార్థకత్వంబును నాశ్రయించి సత్యవ్రతికిం దప్ప
మఱియెవ్వరికిని సంతసముకలుగదనిచెప్పిన నిరవద్యంబని యె
ఱుంగునది.

క. ఇతిహాస శ్రుతిత్వ్యత్తా
నిత నైజసుసత్య చాలనీచాలనపా
వి గుణ మహితునకున్ మది
సతతము సంతసమొసంగు సత్యవ్రతికిన్.

ఇతిహాసములచేతను, శ్రుతులచేతను ననుకూలపరుచం
బడిన సత్యాసునెడు జల్లెడచేతను శుద్ధిచేయంబడిన గుణములచే
తను పూజ్యుండగువానికి సంతసమొసంగునని యర్థము.

క. ఛితి సత్యానందఘనా
త్మతత్త్వబోధామృత రసధారాస్వైరే
యతరీతృపితునకుంబలె
సతతము సంతసమెసంగు సత్యవ్రతికిన్. 36.

మాదకంబగునాసవవిశేషంబుచేతనుంబోలిసత్యజ్ఞానానంద స్వరూపంబగు నాత్మతత్త్వబోధమను నమృతపానముచేతను మిక్కిలితృప్తుండగువానికిని సత్యవ్రతికిని సంతసమెసంగునని తాత్పర్యము. రూపకోపమాలంకారములకు సంసృష్టిగాని సందేహ సంకరముగానియని యెఱుంగునది.

క. సితధారాసిలతామా
త్రితానిత నిరంతరాయ తైజససాహా
య్యతిరస్కృతరిపుధాటికి
సతతము సంతసమెసంగు సత్యవ్రతికిన్. 37.

తీక్ష్ణమగు ఖడ్గధారామాత్రమున వృద్ధిపొందింపఁబడిన విఘ్నరహితమైన పరాక్రమసాహాయ్యముచేతను శత్రువులను తిరస్కరించెడుమహావీరునికిని సంతసమెసంగునని తాత్పర్యము. తుల్యయోగితాలంకారము.- వీరరసము.

క. ఋతకృత నియమోల్లంఘన
కృతభయచకిత చకితపరిష్కృత శతధృతిజా
గతకృణికతనన్ మనమున
సతతము సంతసమెసంగు సత్యవ్రతికిన్. 38.

సత్యనిబంధనమును మీరుటకుభయపడుచున్న ప్రకృత
బ్రహ్మాండవర్తి సృష్టికర్తయగు బ్రహ్మదేవుఁడు జగత్సంబం
ధమయిన సృష్టినిచేయుటచే సత్యవ్రతికి సంతసమొసంగునని
తాత్పర్యము. ఇట్టిసత్యవ్రతమును తానవలంబించుచున్నానని
సత్యవ్రతి యుప్పొంగుచున్నాఁడని భావము.

క. ఋతుమాసాయన వత్సర
కృతభేదోద్భిన్నచిహ్న కీలితజగతీ
స్థితవస్త్వను మితఋతమున
సతతము సంతసమొసంగు సత్యవ్రతికిన్. 39

ఋతుమాసాది కాలభేదమునుంబట్టి పుట్టుచున్నపుష్ప
ఫలాది చిహ్నములతోఁగూడుకొనియున్న లతావృక్షాదిపదా
ర్థములచేతను నూహింపఁబడు సత్యముచేతను సత్యవ్రతికి సం
తసమొసంగునని తాత్పర్యము. క్షిత్యంకురాదికము యొక్క
కార్యత్వమునుబట్టి సకర్తృకత్వద్వారా సర్వజ్ఞత్వ సర్వశక్తి
మత్త్వవిశిష్టపరమేశ్వరానుమితివలెను ఋతుమాసాదికృత
నియత చిహ్నచిహ్నిత వస్తుజాతమునుంబట్టి సత్యసంకల్పుఁ
డగు పరమేశ్వరానుమితిద్వారా సత్యానుమితియుంగలుగునని
యనుమానాభిమానులగు నైయాయికశిరోమణులకు పరిపాటీ
టీకితంబని యెఱుంగునది. చంద్రాలోకోక్తశతాలంకారోపరి
తనప్రమాణాలంకారమధ్యవర్తియగు ననుమానాలంకారము.
కీలితత్వరూపవస్తువుచేతను జగతీస్థితయావద్వస్తువులకును స్వా
తంత్ర్యరాహిత్యరూపవస్తుధ్వనియునుంగలదు.

క. రతిగత బాహ్యాభ్యంతర
గతిచణ కర్కశఘటకుచ కర్ణాటస్త్రీ
రతిరస పరవశునకు బలె
సతతము సంతసమొసంగు సత్యవ్రతికిన్. 40.

ఆలింగన చుంబనాది బాహ్యరత మందును, సమరతి సంపాదక స్త్రీపుంజాతివిశేషానుగుణ తత్తద్బంధ సురతంబువందును, ప్రావీణ్యముకలుగునట్టియును, కుంభములవంటి కఠిన వక్షోజములు కలుగునట్టియు, కర్ణాటస్త్రీ సంసంభోగజన్య శృంగారరసాస్వాదముచేతను, విగళితవేద్యాంతరుడగు పురుషునికివలె సత్యవ్రతికినిసతతము సంతసమొసంగునని యర్థము. బృహదారణ్యకోపనిషత్తునందు సుషుప్త్యవస్థయందుండు బ్రహ్మానందమును సాక్షాత్కరింపఁజేయుటకు శక్యముకాక "తద్యథాప్రియయాస్త్రియా సంపరిష్వక్తోన బాహ్యం కించన వేదనాంతరమేవ మేవాయంపురుషః ప్రాజ్ఞేనాత్మనా సంపరిష్వక్తోన బాహ్యంకించన వేదనాంతరం" — అని స్త్రీసంభోగరూపశృంగారరసము ఉపమానముగాఁ జెప్పఁబడి యున్నందున నిటులఁ జెప్పఁబడినదికాన నిచట నీచోపమయను నాశంక నిరసింపఁబడియె. ఇచటనుపమానద్వయమునకు సంసృష్టియనియు, పరవశత్వరూపవస్తువుచేతను సౌందర్యాతిశయ పరస్పరానురాగాతిశయ కామోపచారవైదగ్ధ్యాదనేక వస్త్వంతరధ్వనియునెఱుంగునది. శృంగారరసము.

క. ధృత కౌక్షేయక ధారా
శతధాకృత శత్రురుధిరసారప్రక్షా
ళిత రోషప్లోషునకున్
సతతము సంతసమొసంగు సత్యవ్రతికిన్. 41.

చేతఁబట్టఁబడిన ఖడ్గముయొక్క ధారచేతను నూరు ముక్కలుగా నరుకఁబడిన శత్రువులయొక్క రక్తసారముచేతను కడుగఁబడిన కోపముయొక్క వేడికలిగిన మహావీరునికిని సత్యవ్రతికిని సంతసమొసంగునని యర్థము. శత్రువులను చంపి కోపమును తీర్చుకొనుచున్నాఁడని తాత్పర్యము. వీరరౌద్రరసములు రెండును నిచటఁగలవు. అంగాంగిభావము వివక్షాధీనమని యెఱుంగునది.

క. అతివాద మృషావాదము
లతిమాత్రముగాఁగ లోకమంతట మదినే
గతి కలిపురుషుల నడుమన్
సతతము సంతసమొసంగు సత్యవ్రతికిన్. 42.

నిరర్థకవాదములును అసత్యవాదములును లోకమంతటను అధికముగా వ్యాపించుచుండఁగా దుర్జనులమధ్యను సత్యవ్రతికి సంతసమేగతిని కలుగునని యర్థము. మిగుల నేర్పరులకుఁ దప్ప తక్కినవారలకు సంతసము దుర్లభమని తాత్పర్యము. కరుణారసము.

క. కేశవ ప్రియంబగు నీ
చతుర్థయుగమున సవాయసరసాలద్రు
స్థిత పికగతినెటులన్నది
సతతము సంతసమొసంగు సత్యవ్రతికిన్. 43.

దుర్జనప్రియంబగు నీకలియుగమున కాకులమూఁకతో నిండియున్న మాకందశాఖయందు కోకిలకు నవలె సత్యవ్రతికి నెటుల సంతసము కలుగునని యర్థము. నేర్పరులకుఁ దప్ప తక్కిన వారికి దుర్లభమని తాత్పర్యము. ఉపమాలంకారము గతిశబ్దము ఉపమావాచకముగా వచ్చును. కరుణారసము. పూర్వపద్యమునకంటె చమత్కార విశేషకృత భేదముండుటచే పౌనరుక్త్య దోషముండదు. రసపౌనరుక్త్యము దోషాపాదకంబు కాదు. కావున నీశతకంబునకును విషయైక్య ప్రయుక్త పౌనరుక్త్యంబు లేదని యెఱుంగునది.

క. జతగూడుచు శబ్దార్థము
లితరేతరమైత్రితోడ నెవ్వనికృతికన్
కుతుకమున మెలఁగునతనికి
సతతము సంతసమొసంగు సత్యవ్రతికిన్. 44.

ప్రకృతకవి మహాకవులను సత్యవ్రతునితోఁ గూడ ప్రశంసించుచున్నాఁడు. "జతగూడుచు" నని, "ఇతరేతరమైత్రి" యనుచోటున కేవలశబ్దములకును కేవలార్థములకును శబ్దార్థోభయమునకును మైత్రియని యర్థము. శిష్టము స్పష్టము.

క. కౌతుకింత లేక సత్కవి
కుతుకన్ బచరింపఁగమరి గోరంతకొరం
త తవుల వినాకృతి కవికి
సతతము సంతసమొసంగు సత్యవ్రతికిన్. 45.

ఇంకను సత్కవిప్రశంసను జేయుచున్నాఁడు. "కౌతుకింత" యని. ఏవిధమయినలోపములులేకుండా సత్కవికంఠము నందు కవితాప్రచారము కలుగుచుండఁగా నాకవికిని సత్యవ్రతికిని సంతసమొసంగునని తాత్పర్యము.

క. అతిశయిత మహిత సూనృత
రతునకు "సత్యంపరంపరమ్మ"ను నీస
ద్శ్రుతిరతునకు మదినిండుగ
సతతము సంతసమొసంగు సత్యవ్రతికిన్. 46.

పూజనీయమగు సత్యమునందునాసక్తిగలిగిన "సత్యంపరంపరంసత్యం" అనుశ్రుతిరతునకును సత్యవ్రతికిని సంతసమొసంగుననియర్థము. "సత్యంపరం" అను నారాయణ ప్రశ్నాంతర్గత ఖండయొక్క అర్థమునుబట్టి మరికొన్ని పద్యములను జెప్పనుద్దేశించి వానికి నుపష్టంభకముగా నీతైత్తరీయ శ్రుతి యుద్ఘాటనచేయఁబడెను.

క. ప్రతిదినమునఁ బవనంబులు
స్మృతిదప్పకవీచుచుండు రేయున్ బగలున్

ఋతమున నదియని తెలిసిన
సతతము సంతసమెసంగు సత్యవ్రతికిన్. 47.

“సత్యేనవాయురావాతి” అను శ్రుత్యర్థమిది. శిష్టము స్పష్టము.

క. ఋతమునకయి దివిజులకున్
సితకిరణుఁడు కళలనిచ్చి చిక్కుచు శుక్ల
ప్రతిపత్ప్రభృతిఁ బ్రబలఁగ
సతతము సంతసమెసంగు సత్యవ్రతికిన్.

చంద్రుఁడు సత్యమునకు బద్ధుఁడయి తనకళలను భక్షణార్థము దేవతలకునిచ్చి మరల వృద్ధిఁబొందుట తెలిసిన సత్యవ్రతికి సంతసమెసంగునని తాత్పర్యము. “తందేవా భక్షయంతి” యను ఉపనిషద్వాక్యము దీనికిఁబ్రమాణము.

క. శతరుద్రియగతమును సం
తతి బలుమరు మదిజపింపఁ దానది సత్య
వ్రతమున కెనకాదనఁగన్
సతతము సంతసమెసంగు సత్యవ్రతికిన్. 49.

రుద్రాధ్యాయమందుండెడు మంత్రసముదాయమునసేక పర్యాయములు జపించినను సత్యవ్రతమునకుసమానముకాదనఁగన్ సత్యవ్రతికి సంతసమెసంగునని యర్థము. రుద్రాధ్యాయపారాయణముకంటెను సత్యవ్రతమెక్కుడని తాత్పర్యము.

క. అతిరాత్రి మహారాత్రి
క్రితువులనతిభక్తితోడ గ్రిక్కున్జేయున్
గృతపుణ్య పూరుషులకున్
సతతము సంతసమెసంగు సత్యవ్రితికిన్. 50.

అతిరాత్రాది క్రతువులను భక్తితోడఁజేసెడు పుణ్య పురుషులకును సత్యవ్రితికిని సంతసమెసంగునని యర్థము.

క. కుతలంబునఁ బరకాంతల
కతిధీరత మననునీయ కమలాత్మతఁ దా
ధృతిఁజెందినఁ దప్పకమది
సతతము సంతసమెసంగు సత్యవ్రితికిన్. 51.

భూతలమునందు పరస్త్రీలకు మననీయక అతిధైర్యము తోనుండు మహాపురుషుఁడగు సత్యవ్రితికి నవశ్యము సంతసమెసంగునని తాత్పర్యము.

క. మృతమూర్ఛిత కపివీర
ప్రితిజీవనకరణదక్ష పరమౌషధులన్
బ్రితుకన్దెచ్చిన కపికిన్
సతతము సంతసమెసంగు సత్యవ్రితికిన్. 52.

మృతప్రాయులయి మూర్ఛనొందిన కపివీరులను బ్రతికించుటకు సంజీవని మొదలగు నోషధులను దెచ్చిన యాంజనేయునికిని సత్యవ్రితికిని సంతసమెసంగునని యర్థము.

క. ఋతమానసు లతిశాంతులు
గతమోహులెప్పుడు తృతీయగతిఁ బొందరు ప్రా
కృతులవగిది నదికావున
సతతము సంతసమెసంగు సత్యవ్రతికిన్. 53.

సత్యబుద్ధికలవారును, శాంతులును, మోహ రహితు లును జననమరణప్రవాహరూపమగుమూఁడవతోవను బొందరు కావున సత్యవ్రతికి సంతసమెసంగునని తాత్పర్యము. దహ రాద్యుపాసనాపరులకు నర్చిరాదిమార్గమును జ్యోతిష్టోమాది కర్మపరులకు ధూమాది మార్గమును ఉభయభ్రష్టులకు మూ డవమార్గమును, ఛాందోగ్యము నందు "యేశ్రద్ధాతప ఇత్యు పాసతే" అనియుపక్రమించి "జాయస్వమ్రియస్వేత్యేత త్తృ తీయంస్థానం" అని చెప్పఁబడియున్నది.

క. ఋతమున రవియున్ సోముఁడు
క్షితలంబున్ ఖతలమును నకుంఠితగతితోఁ
బ్రతిదినము తిరిగి మనుపన్
సతతము సంతసమెసంగు సత్యవ్రతికిన్. 54.

సూర్యచంద్రులిరువురును సదా సంచరించుచు భూమిని నాకాశమును ప్రకాశింపఁజేయుచుండఁగా వ్రతికి సంతస మెసంగునని తాత్పర్యము.

క. క్రతుశతసమమగు ఋతమున
నతిపూజిత భోగవస్తు యంత్రితశాత

క్రితవపవంబగుఁ గావున
సతతము సంతసమొసంగు సత్యవ్రితికిన్. 55

నూరుయజ్ఞములకు సమానమగు సత్యము చేత భో
గాపూర్ణమగు వస్తువులతో నిండియున్న ఇంద్రిపదముకలుగును.
కావున సత్యవ్రితికి సంతసమొసంగునని యర్థము.

క. కృత కేతర సత్సత్య
వ్రితునకు పరమాత్మతత్వవర్త్మజ్ఞునకున్
బిత్రువచన పరిపాలునకున్
సతతము సంతసమొసంగు సత్యవ్రితికిన్. 56.

కపటరహితమగు మంచిసత్యవ్రితము కలవానికి ఆత్మ
తత్వమార్గము నెఱింగినవానికిని పితృవాక్యనిరతునకును సత్య
వ్రితికిని సంతసమొసంగుననియర్థము. ప్రధమచతుర్థచరణముల
యర్థములకునుండు వైలక్షణ్యమును పరిశీలించి పౌనరుక్త్యశం
కను నిరసించవలయును.

క. యతినరులమోలిల గీతా
మృతమునుగ్రోలుచు సదాత్మమీమాంసా సం
గతిఁజెలఁగిన సుకృతికి మది
సతతము సంతసమొసంగు సత్యవ్రితికిన్. 57

సన్యాసులవలన భగవద్గీతా సారమును దెలిసికొనుచు

నల్లపుడున నాత్మవిచారమును చేయుచున్నవానికిని సత్యవ్రతి కిని సంతసమెసంగునని తాత్పర్యము.

క. వెతపాయును దుస్తర సం
స్సృతి సాగరదుఃఖజాల శిథిలత కలుగున్
మితిలేని సిరులు పొంగును
సతతము సంతసమెసంగు సత్యవ్రతికిన్. 58

సత్యవ్రతునకు బాధలు నివర్తించును. సంసారదుఃఖ సముద్రము శైథిల్యమునుపొందును. అపరిమితములగు సంప దలు వృద్ధిపొందును. సతతముసంతసమెసంగునని యర్థము.

క. ఋతమున కీడుంజోడును
వెతుకంగాఁజాలమెందు వేయేండ్లైనన్
మతి నిది తెలిసి మెలంగిన
సతతము సంతసమెసంగు సత్యవ్రతికిన్. 59

సత్యమునకును సామ్యమును సజాతీయ ద్వితీయ వస్తు వును చాలదినములు శోధించినను నెక్కడను గానఁజాలమని తెలిసిమెలఁగిన సత్యవ్రతికిని సంతసమెసంగునని యర్థము.

క. సతశ్రితశత శమదముఖులు
శ్రితనిత్యానిత్యవస్తు సువిచారంబుల్
ఋతమున కెనయనఁదగమిని
సతతము సంతసమెసంగు సత్యవ్రతికిన్.

స్తోత్రార్హంబులగు నూరులకొలఁది శమదమములను శ్రుతములగు నిత్యానిత్యవస్తువులయొక్క విచారములును సత్యమునకు సమానముకావని తెలిసిన సత్యవ్రతికి సంతసమెసంగునని యర్థము.

క. ఋతమనధర్మంబతి సు
ప్రతిష్ఠితంబగుచునుండు బరిపంథులు ని
ర్జితులగుదురు కావునమది
సతతము సంతసమెసంగు సత్యవ్రతికిన్. 61

ఋతముచేతను ధర్మము స్థిరపర్చఁబడును. శత్రువులు జయింపఁబడుదురు. కావున సత్యవ్రతికి సంతసమెసంగునని యర్థము.

క. ఋతమున సత్యంబన సూ
నృతమనఁగా సత్యదేవునికి సర్వజగ
త్పతికిన్ దగుఁగావున మది
సతతము సంతసమెసంగు సత్యవ్రతికిన్. 62.

ఋతము, సత్యము, సూనృతము, అను నీమూఁడుపదార్థములును సత్యాధిష్ఠానదేవతయును జగత్పతియు సత్యస్వరూపుండునగు భగవంతుండునునగుచున్నవి. కావున సత్యవ్రతికి సతసమెసంగునని పిండితార్థము. తానవలంబించిన వ్రతము

సత్యదేవునితోను సంబంధించియున్నదని సంతసించునని తా త్పర్యము. వ్యాకరణ వేత్త్రుమతమందు శబ్దము అర్థమునకు విశేషమగుచున్నందున విశేషణభేదమునుబట్టి విశిష్ట భేదము నుంగలదు. కావున నతివ్రిసక్త్తశంకల కవకాశములేలు.

క. ఋతమున్ దప్పక యుండిన
యతఁడెంతయు నాకలోక హర్మ్యాంతభూా
గతుఁడై సుఖించుఁగావున
సతతము సంతసమొనంగు సత్యవ్రతికిన్. 63

సత్యమును దప్పక జరుపుకొను వాఁడు స్వర్గలోకమునం దుండు నంతఃపురప్రదేశములయందు సుఖించును గనుక సత్య వ్రతికి సంతసమొసంగునని యర్థము.

క. వితరణయజనాధ్యాపన
లితరోపకృతుల్ ఋతమునకైనకావని ధీ
రతమల్ వాక్రుచ్చుటచే
సతతము సంతసమొసంగు సత్యవ్రతికిన్. 64.

దానయాగాధ్యాపనలును, పరోపకారముదును, సత్య మునకు సమానముకావని మహావిద్వాంసులు చెప్పుటచేతను సత్యవ్రతికి సంతసము ఎల్లప్పుడు గలుగునని యర్థము.

క. అతలాచలాది జగతీ
ద్వితయంబున గాంగపూరవిసరశ్రేణీ

గతికీర్తి వెలసి వెలుఁగున్
సతతము సంతసమెసంగు సత్యవ్రతికిన్. 65.

పదునాలుగులోకములయందును గంగాప్రవాహ సమూహ శ్రేణివలెను సత్యవ్రతికీర్తి వ్యాపించును. అతనికిసతతము సంతసమెసంగునని తాత్పర్యము.

క. వెతఁబొందక ధృతిఁజెడకయు
ఋతమే బ్రతుకని మనమున నిడి చంద్రమతీ
పతిగతిఁ జలింపకుండిన
సతతము సంతసమెసంగు సత్యవ్రతికిన్. 66.

బాధలనుబొందక ధైర్యమును విడువక హరిశ్చంద్రుని వలె సత్యమునునమ్మి స్థిరముగనుండినయెడల సంతసమెసంగు నని తాత్పర్యము.

క. క్రతువుల సలిపెడు సోమ
వ్రతులగు బ్రాహ్మణులకుఁదగ వందనములనా
రత మొనరించుచు మించిన
సతతము సంతసమెసంగు సత్యవ్రతికిన్. 67.

యజ్ఞములనుచేసెడు సోమయాజులకుభక్తితో నమస్కరించుచుండిన సంతసమెసంగునని తాత్పర్యము. పరమేశ్వరుని యొక్క అష్టమూర్తులలో నొకమూర్తిగా సోమయాజి

యుండుటచే నిటులం జెప్పంబడియె. ఇది దేవతావంగనమునకు నుపలక్షకంబని యెఱుంగునది.

క. కృతకృత్యుఁడనఁగ నాతఁడె
యతమానసుఁడనఁగ నొప్పు నాతఁడె చూడన్
బుతమున నెవనికి మనమున
సతతము సంతసమొసంగు సత్యవ్రతికిన్. 68.

ఏ సత్యవ్రతికి సంతసమొసంగునో యతఁడే కృతకృత్యుఁడును మనోనియమము కలవాఁడునని చెప్పఁబడునని తాత్పర్యము.

క. నుతికెక్కిన సత్యవతీ
సుతుని నిగమసదృశమహితసూక్తుల నత్యా
యతసూక్ష్మదృష్టి నెఱిఁగిన
సతతము సంతసమొసంగు సత్యవ్రతికిన్. 69.

స్తోత్రార్హుండగు వ్యాసమహర్షియొక్క వేదసమానమైన పురాణోక్తులను తెలిసికొనఁగా సత్యవ్రతికిసంతసమొసంగునని తాత్పర్యము.

క. అతిసూక్ష్మ ధర్మగోచర
మతిచేరచితంబగు విధిమనుమని శ్రీభా
రతమతము తెలిసిమెలఁగిన
సతతము సంతసమొసంగు సత్యవ్రతికిన్. 70.

మిక్కిలిసూక్ష్మములగు ధర్మముల నవగహించెడుబుద్ధితో రచింపఁబడిన బ్రహ్మదేవుని మనుమని భారతగ్రంథముయొక్క మతమును తెలిసి ప్రవర్తించినట్లయితే సత్యవ్రతికి సంతసమెసంగునని యర్థము. పూర్వపద్యమునందు సామాన్యముగా వ్యాసోక్తులనియు నిచ్చటవిశేషరూపముగా భారతమునియు జెప్పుటచేతను పౌనరుక్త్యములేదు. సత్యస్వరూపమును వివరించుటకుఁ బ్రమాణముగా నీపద్యద్వయం బుపన్యసింపం బడినది.

క. జతుకాష్ఠాకృతి సత్యా
నృతములు కలిసియుమెలసియు నెగడుండావా
ని తారతమ భావమెఱిఁగిన
సతతము సంతసమెసంగు సత్యవ్రతికిన్. 71.

సత్యమును, అనృతమును మిక్కిలి మిళితములయియుండునుగావున తానువాని తారతమ్యముననఁగా ప్రాబల్యదౌర్బల్యమును తెలిసి మెలఁగిన సత్యవ్రతికి సంతసమెసంగునని తాత్పర్యము.

క. అతిదేశము నపవాదము
నతినైపుణితోడఁదెలిసి యనయము కాలో
చితముగఁదా మెలఁగినమది
సతతము సంతసమెసంగు సత్యవ్రతికిన్. 72.

అతిదేశమును నపవాదమును నైపుణ్యముతోఁ దెలిసి కొని తత్త్వాలోచితముగాఁ బ్రవర్తించినయెడల సత్యవ్రతికి సంతసమే సంగునని యర్థము. ఒకచో నవృతము సత్యఫలము నిచ్చుననుట యతిదేశము. కొన్ని విషయములందప్ప సత్య మును బలుకవలయుననుచోటున నపవాదము. ఇట్టి విధినిషేధ ములును శాంతిపర్వంబునఁ జెప్పంబడియున్నవి.

క. శ్రుతిగీత విధినిషేధము
లతగన్ "సత్యంవద" యని లలితంబుగనా
నృతమని తెలిసి మెలంగిన
సతతము సంతసమె సంగు సత్యవ్రతికిన్. 73.

శ్రుతిచేతను చెప్పఁబడిన విధినిషేధమును లతవలె నన్యోన్యక్రోడీకారముతోఁ దెలిసిమెలఁగిన సంతసమె సంగునని తాత్పర్యము. విధినిషేధాపవాద ప్రతిప్రసవములను దెలుసుకొ నుటలో నైకైక జ్ఞానకాలమునందు నితరములఁగూడనవగహించ వలయునుగాని కాకాక్షిన్యాయముగా నుండఁగూడదనియభి ప్రాయము.

క. ఋతమున ధర్మముబుట్టు న
నృతంబున నధర్మమును జనించు ననుచుఁ దా
మతిమంతుఁడగుచుఁ మెలఁగఁగ
సతతము సంతసమె సంగు సత్యవ్రతికిన్. 74.

సత్యము ధర్మజనకము. అనృతము అధర్మజనకము కావున ధర్మవిరోధము లేకుండునటుల సత్యము నవలంబించు వానికి సంతసమెసఁగునని తాత్పర్యము.

క. ఋత మనృతంబును విపరీ
తతఁజెందు నొకప్పుడదియుఁ దడఁబడకయుఁ దా
మతిచేఁ బరిశీలించిన
సతతము సంతసమెసంగు సత్యవ్రతికిన్. 75.

సత్య—పాపజనకమును ననృతము పుణ్యజనకమును నీరీతిగా సత్యానృతములు ఒకప్పుడు వైపరీత్యమున బొందును గాన నది తెలిసి తడఁబడకయుండిన సత్యవ్రతికి సతతము సంతసమెసంగునని యర్థము.

క. ప్రతివస్తువు నియతముగ న
మృతతుల్యంబును విషోపమితమగుచుండున్
మతినెఱుఁగ విషామృతముల
సతతము సంతసమెసంగు సత్యవ్రతికిన్. 76.

లోకమందుప్రతివస్తువును నాయాసమయములయందు అమృతముతోన విషముతోను సమానము నియతముగానగు చున్నది కనుక విషామృత భావమును బుద్ధిచేతను తెలిసికొనిన సత్యవ్రతికి సంతసమెసంగునని యర్థము. దధిభక్షణంబు దివా భాగమునందు శ్రేయస్కరంబు. నిశా సమయంబున

నశ్రేయస్కరంబు. ఇటులనే స్వస్త్రీ సంభోగంబును ఋతుకా లంబున ధర్మజనకంబు. వ్రతాదిదినములయందు నధర్మజనకం బును నగుచుండును. ఇటులనే సత్యానృతములను గూడ తెలి యవలయునని తాత్పర్యము.

క. ఋతమొకచో మనుజునకున్
బతనంబొనరించి మించి పరగుచునుండున్
కృతమతి యది తెలిసిమెలఁగ
సతతము సంతసమొసంగు సత్యవ్రతికిన్. 77.

సత్యము ఒకప్పుడు మనుష్యునకు నరకపాతమును కలుఁగఁజేయును. కనుక నది మంచిబుద్ధితోఁ దెలిసి ప్రవర్తించిన యెడల సంతసమొసంగునని యర్థము. ఈసంగతి నుత్తరపద్య ములచేతను వివరింపఁబడును.

క. అతివల కిసుమంతేనియు
వెతఁగలిగింపక వివేకవిస్తృతితోడన్
బ్రతుకు తెరఁగెఱిఁగి మెలఁగిన
సతతము సంతసమొసంగు సత్యవ్రతికిన్. 78

స్త్రీలకు కొంచెమైనను బాధకలుగఁజేయక విస్తార ముగ తెలివితో బ్రతుకుతెన్నెఱిఁగి తిరుగనేర్చినట్లైన సత తము సంతసమొసంగునని యర్థము.

క. ఋతమునకయి తా నెలుకను
మతితోఁ బిల్లికినిజముగ మఱుగీయక చూ
పి తిరిగినయటులఁ గామిని
సతతము సంతసమొసంగు సత్యవ్రతికిన్. 79

సత్యమునకయి ఎలుకను పిల్లికి చూపించి చంపించు చున్నయటులఁ గాకుండిన సంతసమొసంగునని తాత్పర్యము.

క. గతిమాలినదని దయతోఁ
గుణకంబున నొక్క వెఱ్ఱికుక్కను బెనపన్
గుతుకనది కొఱుక నెటులను
సతతము సంతసమొసంగు సత్యవ్రతికిన్. 80

దిక్కుమాలినదని కనికరముతో నొక వెఱ్ఱికుక్కను సంతోషముతో సంరక్షింపఁగా నా వెఱ్ఱికుక్క, పెంచినవారి యొక్కయు నితరులయొక్కయు కంఠమును కఱచుచుండఁగా వానికినెటుల సంతసమొసంగునని యర్థము. ప్రస్తుతా ప్రస్తుతాలకున్ కృతజ్ఞతారహిత దుర్జనవృత్తాంతములకుం గల ప్రకృతత్వా ప్రకృతత్వంబులు వివక్షాయత్తంబులగుటంజేసి అప్రస్తుత ప్రశంసా ప్రస్తుతాంకుర సమాసోక్తి వ్యాజనిందా వ్యాజస్తుతులను నయిదు అలంకారములకు సందేహసంకరమని యూహింపవలయును. హాస్యరసము శాంతరసముతోఁగూడ శృంగారము మొదలగు షడ్రసములను నచ్చుటచ్చుటఁ గనఁబరచుట చేతను

(దశాన్వితమౌ స్వసమనియతాన్వితమత్వ సంపాదనార్థము షో
స్యాలంబనముగా) నీ శునకవృత్తాంతంబు చెప్పఁబడినది.

క. శ్రుతకిరిగజఖరకాంభో
జతురంగభిదానభిజ్ఞ జనతామధ్య
స్థితనిజదుస్థితి నెటులన్
సతతము సంతసమెసంగు సత్యవ్రతికిన్. 81

సుప్రసిద్ధంబగు సూకర క్రరి భేదము న ఖరతురంగభేద
మును నెఱుఁగని మూర్ఖజనసంఘమధ్యమందుండువానికి నెటుల
సంతసమెసంగుననియర్థము. పూర్వపద్య రీతిని రసాలంకార
మును నెఱుంగునది.

క. ఋతమున యావద్గుణ సం
తతి నచ్చుగఁబోల్పవచ్చు తత్తద్ధూమ
స్థితిచే వహ్నిస్థితివలె
సతతము సంతసమెసంగు సత్యవ్రతికిన్. 82.

అనుమానప్రమాణమును బట్టి ధూమము చేతను వహ్నిని
దెలిసికొనునటుల సత్యముచేతను సత్యవ్రతునియొక్క సద్గుణము
లన్నింటిని నతనికిఁగలిగెడు సంతోషాభివృద్ధినిఁగూడఁ సరిగాఁ
దెలిసికొనవచ్చుననియర్థము ; అనుమానప్రమాణాలంకారము.



స నా ళ షో డ శ ద ళ ప ద్మ బం ధ ము.

84వ పద్యమును చూడుడు.

~ ఏకాక్షరము. ~

క. ఋత తిత ఉత్తు త్రి తా
త తేతి తా తేత తా త త్తై త్తా
తత తు త్తా తతి త్తు త్తిన్
సతతము సంతసమొసంగు సత్యవ్రతికిన్. 83.

ఋత=సత్యమనెడు, తితఉ=జల్లెడచేతను, ఉత్తుత్తి=జల్లించుటచేతను, ఇత=పొందఁబడిన, ఆతత=విస్తారియగు, ఇతి=జ్ఞానముచేతను, తాత=తండ్రివంటిపరమేశ్వరునియొక్క, ఇత=పొందఁబడిన, తాత=దయచేతను, తత్తైత త్తా=అది యిదియనుభేదజ్ఞానముచేతఁగలిగిన, తత=అధికమగు, తుత్తాతతి=బాధసమూహమును, తుతిన్=కొట్టుటచేతను, సత్యవ్రతికి సంతసమొసంగునని ప్రతిపదార్థము. పదార్థశోధనముచేతఁగలిగిన జ్ఞానముచేతను, నీశ్వరానుగ్రహముచేతను, సంసారదుఃఖముతొలఁగుననియు నందుకుసత్యము మూలమనియు తాత్పర్యము. "తతంవ్యాప్తే విస్తృతేచ। తాతో౽నుకంపేపితరి। ఇతంగతంచజ్ఞానేపి॥" అని నానార్థరత్నమాలయందుఁ జెప్పఁబడియున్నది.

~ సనాళ షోడశదళపద్మ బంధము. ~

క. ఋతపూత పూతజాత వి
తతోతగీత శ్రితసుత్రరత ఘూత్రిత
వ్రతజిత కృతకేతరతన్
సతతము సంతసమొసంగు సత్యవ్రతికిన్. 84.

ఋత=సత్యముచేతను, పూతపూత=పవిత్రమగునటుల
జాత=పుట్టుచున్న, వితత=అధికముగా, ఊత=అనుస్యూతము
యైన, గీత=వాగ్వ్యాపారమును, శ్రుత=శ్రవణవ్యాపారమును,
సృత = గమనరూపపాద వ్యాపారమును, రత=రతియును,
ఘ్రాత=ఘ్రాణేంద్రియవ్యాపారమును, అను. వ్రత=వ్రతము
చేతను, జిత=స్వాధీనముచేసుకొనఁబడిన. కృతకేతరతన్=సృష్టా
పట్యముచేతను, సత్యవ్రతికి సంతసమొసంగునని యర్థము.
సత్యముచేతను పవిత్రముగాఁబుట్టుచున్న కర్మేంద్రియ జ్ఞానేం
ద్రియ వ్యాపారముల యథార్థ్యముచేతను సంతసమొసంగునని
తాత్పర్యము. సనాళషోడశదళపద్మబంధము. మూఁడు పాద
ములు దళములయందున, సమస్యారూపమగు నాలవచరణము
నాళమందును గూర్పఁబడియెను.

క. సతికొడుకు ప్రాఁబలుకుల ప
డఁతియును నానుడులకు బెడంగుఁ గడుం గూ
రుతురౌఁగాకను కవికిన్
సతతము సంతసమొసంగు సత్యవ్రతికిన్. 85.

పార్వతీపుత్రుండగు వినాయకుండును వేదమాతయగు
సరస్వతీదేవియును నావాక్యములకు మిక్కిలి గొప్పదనమును
గలుగఁజేయుదురుగాక యని కోరుచుండెడు కవికిని సత్యవ్రతు
నకును సంతసమొసంగునని యర్థము. గ్రంథాంతమందును
గూడ మంగళంబు చేయఁబడుచున్నది. ఇచట సరస్వతీ వినా
యకులు స్వవాచకరూఢపదములచేతను చెప్పఁబడక పర్యాయ

ముగాఁ జెప్పఁబడుటచేఁ బర్యాయోక్తాలంకారము. "పర్యాయోక్తంతు గమ్యస్య వచోభంగ్యంతరాశ్రయం" అని లక్షణము.

క. భూతలంబున గతకల్మషు
లతివాదములం దగులక యత్యాదరణం
బుతమిం జూపుచుఁ బలికిరి
"సతతము సంతసమొసంగు సత్యవ్రతికిన్." 86

భూతలమందు నిష్కల్మషులగువారు అధికప్రసంగములలోనికిఁ బోక ప్రేమతో నాదరమును జూపుచు "సత్యవ్రతికి సంతసమొసంగు"నని పలికిరని యర్థము. వత్సలరసము.

క. ఇతిహాస పురాణకథా
శ్రుతులన్ బలుమరు వెతుకుచు సొంపుగ సిద్ధాం
తితమని యిటులం బలికిరి
"సతతము సంతసమొసంగు సత్యవ్రతికిన్." 87.

ఇతిహాసములను, పురాణములను, వృద్ధపరంపరాగత కథాశ్రవణములను, లేక పురాణకథలను, వేదములను అనేకపర్యాయములు శోధించుచు సిద్ధాంతితమని సొంపుగఁ బలికిరని యర్థము. ఇచట, ఇతిహాసాదిజ్ఞులు పలికిరని గమ్యమానకర్తృపదమును నూహింపవలయును. అర్థానువాదము చేతను సమస్యార్థసంగతియును నెఱుంగవలయును.

క. జితకాములు హతలోభులు
ప్రతిమారహితార్థ ధర్మపరులునగు మహా
మతు లిటులఁ బలికి రెటులన
"సతతము సంతసమొసంగు సత్యవ్రతికిన్." 88.

జయశీలురును లోభరహితులును అసమానార్థ ధర్మపరు లునునగు మహాబుద్ధిమంతులు సత్యవ్రతికి సంతసమొసంగునని పలికిరని యర్థము. విశేషణ మహిమచేతను గమ్యమానంబగు నర్థమును భంగ్యంతరముచేతను చెప్పుటచేతను పర్యాయోక్తాలంకారము. లక్షణము పూర్వమందుఁ జెప్పంబడియున్నది. ఇచటను ఏతత్సజాతీయ స్థలములయందును గమ్యమానార్థము సమన్యాకేతనరూపమని తెలియంగునది.

క. ఋతతత్త్వజ్ఞులు ప్రాజ్ఞులు
శ్రుతిసారజ్ఞులు నిరుపమసుమ సమశీలుర్
మతిఁ గనికరముఁ బలికిరి
"సతతము సంతసమొసంగు సత్యవ్రతికిన్." 89

సత్యతత్త్వజ్ఞులును వేదసారజ్ఞులును నిరుపమానంబగు పుష్పసదృశస్వభావులునగు ప్రాజ్ఞులు దయతోను సత్యవ్రతికి సంతసమొసంగునని పలికిరనియర్థము. "నిరుపమ సమశీలురు" అనుచోటున నాపాతతః విరోధము భాసించుటచేతను విరోధాభాసాలంకారమును పర్యాయోక్తాలంకారమును తిలతండులన్యాయముగా సంసృష్టిని బొందియున్నవని తెలియంగునది.

క. కుతుకంబున శ్రీకృష్ణుఁడు
సతులుం దానును రతిరససమతం జెలఁగన్
సతులకు నిటులను "నిటులను
సతతము సంతసమెసంగు సత్యవ్రతికిన్." 90.

శ్రీకృష్ణస్వామి తానును తనభార్యలును రతీరస సమతతోఁ దేలుచున్నసమయమందు "నీరీతినిసత్యవ్రతికిని సంతస మెసంగు" నని యీప్రకారముగాఁ దనభార్యలతోఁ బలుకు చుండునని యర్థము. సత్యవ్రతియొక్క యానందము బ్రహ్మా నందసబ్రహ్మచారి శృంగారరసాస్వాదతుల్యంబని తాత్పర్యము. కవినిబద్ధవక్తృప్రౌఢోక్తిమూలక సత్యవ్రతి సంతోషాతిశయ రూపవస్తుధ్వని "ఇటులన్" అనుపదముచేతను గలుగుచున్న దని సహృదయు లెఱుంగుదురు.

క. సతతాహంతా మమతా
మతిదూరునకున్ విధూతమాత్సర్యునకున్
ప్రతిపదరహితపరునకుఁ
సతతము సంతసమెసంగు సత్యవ్రతికిన్. 91.

ఎల్లప్పుడును నహంకార మమకారములచేత రహితుం డును మాత్సర్యవిహీనండును ప్రతిపదము పరోపకారపరుం డును నగు సత్యవ్రతికి సంతసమెసంగునని యర్థము.

క- చ్యుతసంస్కార విరహిత మ
హితపదవి తతిరచనాప్రహితకవితా సా
దిత సరస కృతిజ్ఞనకున్
సతతము సంతసమొసంగు సత్యవ్రతికిన్. 92

చ్యుతసంస్కారదోషలక్షిత పదవాక్యార్థగత యావద్దోషరహితపదసందోహరచనాప్రేరితకవితా సాధితంబగు రసవిశిష్టప్రబంధజ్ఞుండగుసత్యవ్రతికి సంతసమొంగుననియర్థము.

క. ప్రతిమారహిత ప్రాచీ
నతరప్రథిత కవితామనన మహిమనవీ
నతర కవితతిరత మనికి
సతతము సంతసమొసంగు సత్యవ్రతికిన్. 93.

అసమానంబగు మిగులఁ బ్రాచీనకవులయొక్క ప్రసిద్ధమయిన కవితాపరిశీలనముచేతనయిన మహిమకలిగిన నవీనతర కవిసంఘమందు వాసక్తమయిన మనస్సుకల సత్యవ్రతికి సంతసమొసంగునని యర్థము.

క. పతిదైవత కాంతామణి
పతికిన్ పత్నీరతపతి పత్నికి నింకె
వ్వతకుఁ గారికి సిరకిన్
సతతము సంతసమొసంగు సత్యవ్రతికిన్. 94.

భర్తను దేవునిగా భావించెడు స్త్రీరత్నముయొక్క భర్తకును భార్యయందు మిగుల ప్రేమఁగలపురుషుని యొక్క ధర్మపత్నికిని ఇంకెవ్వతె కాఁగా గౌరీదేవికిని లక్ష్మీదేవికిని సత్యవ్రతునకును సంతసమొసంగునని యర్థము. ఆద్యంతములయందు పుంసులకు జెప్పుటచేత నుపక్రమునకు బాధకము లేదు. పత్నికినని స్త్రీని జెప్పి తదనుగుణముగాఁ బ్రవర్తించిన స్త్రీవిషయకప్రశ్నమునకుఁదుదకును నేకరీతిగానుత్తరము చెప్పఁ దలంచి "సత్యవ్రతికిన్" అనుచో సత్యవ్రతిభార్యకునని యర్థముఁ జెప్పవచ్చును. ఇంతియకాక శ్లేషమహిమచేతను సత్యవ్రతి దంపతు లనుభయులనుగూడ జెప్పినబాధకము గానం, బడదు. పుంయోగంబునంబట్టి సత్యవ్రతీపదము సత్యవ్రతుని భార్యను దెలియఁజేయును. సత్యవ్రతశబ్దము ఇచ్చటనాఖ్యగాఁ జెప్పవచ్చును. ఈశ్వరసంకేతమువలె నాథునిసంకేతంబులును బిరుదనామములును యోగరూఢంబు లగుటఁబట్టియు ఇతిహాసస్మృతిపుష్టి ప్రమాణంబులంబట్టి ప్రకృత సత్యవ్రతపదమునకు నాఖ్యాత్వము నిర్వివాదంబగుటంజేసి "పుంయోగాదాఖ్యాయాం" అనుసూత్రము ప్రవర్తించుటకు బాధకంబు లేదని యెఱుంగునది. ఇంకనిచ్చట పాఠాంతరమునుం గలదు. యెటులనిన పత్నికి లక్ష్మీపతికిన్ గౌరీపతికిన్ అని యీపక్షంబున నర్థము సుగమము. పాదద్వయమందును తుల్యయోగితాలంకారము సమానము. పూర్వపాదమునందు శ్లేషాలంకారంబునుం గలదు.

క. మతినానంద శ్రీగజ
పతిరాజేంద్రునకు సత్యభామా పతికిన్
కృతకేతర వాక్పతికిన్
సతతము సంతసమెసంగు సత్యవ్రతికిన్. 95.

నామజాత్యాది వర్జితంబయి కేవలసచ్చిదానంద ఘనంబగు పరమాత్మస్వరూపంబు సృష్టిసమయంబున మాయాప్రతిబింబితంబయి ఈశ్వరాకారతను బొందునటులను నేపథ్యాంతర్హితంబులకు నాయికా నాయకాద్యుత్తమ పాత్రంబులు నేపథ్యవినిర్గతంబులయి రంగస్థలిం బ్రవేశించునటులను సత్యవ్రతి సరసపార్జ్ఞాది సాధారణపదములచేనిదివఱకును భేరొక్కనంబడియుండు అసాధారణంబగు "నానందగజపతి" యను నామధేయముచేతను కృతినాయకుండు భేరొక్కనం బడుచున్నాఁడు. మతినానందశ్రీయని సత్యమునకును కాంతికిని లక్ష్మికిని నధిపతియును కృతికేతరములగు సత్యవాక్కులకు పతియును సత్యవ్రతియును నగు శ్రీమదానందగజపతి మహారాజునకు మతిని సతతము సంతసమెసంగునని యర్థము. ఇంక సత్యభామాపతియగు శ్రీకృష్ణునకును కృతకేతరంబులగు వేదవాక్కులకు నధిపతియగు బ్రహ్మదేవునికిని సత్యవ్రతియగు శ్రీమదానంద గజపతి మహారాజునకును సంతసమెసంగునని యర్థము. శ్లేషాలంకారమునకును తుల్యయోగితాలంకారమునకు నంగాంగిభావసంకరము సందేహసంకరంబునుం గలదు.

క. అతిరుచిర ఆంధ్రకృత సం
స్కృతభాషా ద్వితయరమ్య కృతిగతరస వి
జ్ఞాతి కానందగజపతికి
సతతము సంతసమెసంగు సత్యవ్రతికిన్. 96.

మిక్కిలి మనోహరమగు నాంధ్రసంస్కృత భాషాద్వ
యము చేతను రమ్యమయిన ప్రబంధములయందుండు రసమును
దెలిసిన శ్రీమదానందగజపతి నామధేయ కమల సత్యవ్రతికి
సంతసమెసంగుననియర్థము. కావ్యలింగాలంకారము. ఆనంద
రూపవస్తువుచేతను కావ్యభావనాపరిపక్వ బుద్ధిమత్త్వారూప
వస్త్వంతరము ధ్వనితంబగుచున్నది ధ్వనిప్రధానోత్తమ
నాయకత్వాములచే శతకరూపంబగు నీకావ్యంబునకు నుత్తమ
త్వంబును దానింబట్టి కవికి గృతార్థతయును నీవిధముగా
ధ్వని పరంపర నెఱుంగునది.

క. మతిభేద భిన్న భిన్న
ప్రతికవి కవితారస పరిపాకపరీక్షా
క్షతదీక్షోత్సాహునకున్
సతతము సంతసమెసంగు సత్యవ్రతికిన్. 97.

అనేకులగు కవులయొక్క బుద్ధిభేదమునుంబట్టి భిన్న
భిన్నములగు కవితారస పరిపాకములను పరీక్షించుటయందు
నక్షీణంబులగు దీక్షోత్సాహంబులు కలుగునట్టియు సత్యవ్రతి
యునగు శ్రీమదానందగజపతి మహారాజునకు సతతముసం

తసమెసంగునని యర్థము. పర్యాయోక్తా లంకారము. వీర రసము. యుద్ధవీరులు, దానవీరులు, విద్యావీరులును నీరీతిగా వీరత్వ మనేకవిధములుగా నున్నవి. ప్రకృతమున విద్యావీర త్వమును జెప్పుటచే వీరరసమని చెప్పఁబడినది.

క. అతిదుర్జయ పంచేంద్రియ
పతిషష్ఠేంద్రియ మదగజ బంధాలా నా
యితసత్య వైభవంబున
సతతము సంతసమెసంగు సత్యవ్రతికిన్. 98.

జయించుటకు శక్యముకాని త్వక్ చక్షు శ్రోత్ర జిహ్వా ఘ్రాణ రూప పంచేంద్రియములకును నధిపతియగు మానసను నెడుమదగజమునకుఁగట్టు కంబమువంటి సత్యముయొక్క వై భవముచేతను సత్యవ్రతికి సతతము సంతసమెసంగునని య ర్థము. సత్యము ఇంద్రియములు దుర్విషయము ల యందు బ్రవర్తించకుండునటులఁబుచునని కాపాడునని తాత్పర్యము. సావయవరూపాలంకారమునకును ఉపమా లంకారమునకును సంసృష్టిరూపాలంకారాంతమును పర్యాయోక్తాలంకారమును గూడ నూహింపవలయును.

క. శతపత్ర పత్రశతక
ప్రతిమాయిత సత్యశతక పరిశీలనచే
మతి నానందగజపతిక
సతతము సంతసమెసంగు త్యవ్రతికిన్. 99

నూరుదళము లుకల పద్మముయొక్క దళశోభకును
సమానమగు సత్యవ్రతీశతక పద్యాక్షర పరిశీలనముచేతను
సత్యవ్రతియగు శ్రీమదానందగజపతిమహారాజునకు మానం
బున సంతసమెసంగునని యర్థము. ఉపమాలంకారము. హే
త్వలంకార విభావనాలంకార హేతూత్ప్రేక్షా లంకారంబు
లూహ్యంబులు. విధ్యలంకారముతోఁ గూడనన్నిటికిని యథా
సంభవముగ సంకరసంసృష్టుల నెఱుంగునది.

క. బుధమానంద శ్రీగజ
పతికి జయము మంగళంబు పరమార్థంబున్
సుతులు సితచ్ఛత్రాదులు
సతతము సంతసమెసంగు సత్యవ్రతికిన్. 100.

శ్రీమదానందగజపతిమహారాజునకు నెల్లపుడును సత్య
మును జయంబును మంగళంబును నుత్కృష్టంబగు ధనసంపత్తి
యును బుత్రులును శ్వేతచ్ఛత్రచామరాదిమహారాజచిహ్నం
బులును నెసంగుంగాకయని యర్థము. విధ్యలంకారము. "సిద్ధ
స్యైవవిధానం యత్తమాహుర్విధ్యలంకృతిం" అనిలక్షణము.
విభావనాలంకారమును గూడ సూక్ష్మదృష్టిచే నూహింప
వలయును.

క. శ్రీతలక్ష్మీనారాయణ
కృత సత్యవ్రతిశతక సుకృతికానంద

క్షితిపాలాగ్రణికిన్ మది
సతతము సంతసమొసంగు సత్యవ్రతికిన్. 101.

లక్ష్మీనారాయణ కవిచే రచితంబగు సత్యవ్రతిశతక స్వరూపంబగు బ్రబంధమును నాకర్ణించుటచేతను సత్యవ్రతి యగు శ్రీమదానందగజపతి మహారాజునకు సతతము సంతసముప్పొంగునని యర్థము. స్వభావోక్త్యలంకారము. కొందరి మతంబున నతిశయోక్త్యలంకారము. కావున సందేహసంకరంబు భయంబునకు నీమతభేదంబునంబట్టి కలదని యాలంకారికోత్తము లెఱుంగునది.

ఇది శ్రీమదానంద గజపతి మహారాజ
ప్రేరణా ప్రేరితుండగు
భాగవతుల లక్ష్మీనారాయణ కవిచే
వి ర చి తం బ గు
సటిప్పణ
సత్యవ్రతిశతకము
సర్వంబును సంపూర్ణము.



## శుద్ధపత్రిక.

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 3 | 24 | రము | రముః |
| 7 | 19 | దిఙ్మాత్రి | దఙ్మాత్రి |
| 8 | 13 | మిక్కిల | మిక్కిలి |
| 8 | 20 | సతతను...కిన్ | "సత...కిన్" |
| 8 | 21 | సర...గాన్ | "సర..గాన్" |
| 18 | 1 | తాళకారా | తాళకాలా |
| 20 | 1 | పునాస్ప్రిహ్మా | ఏనాస్బ్రహ్మ |
| 23 | 17 | నిషాప్రపా | నిష్ఠాప్రిష్ఠా |
| 29 | 12 | అతినాద | అతివాద |
| 38 | 4 | లేలు | లేదు |
| 51 | 4 | సంతప | సంతస |